శ్రీ రస్తు.

శ్రీ

# చోరచరిత్రము

— * అను * —

## తిరుమంగయాళ్వారు చరిత్రము.

గ్రంథకర్త:


## కేసిరాజు వేంకటసుబ్బారాయకవి



మొదటికూర్పు 500 ప్రతులు

ప్రకాశకులు :

తమిరిశ వేంకటరమణారావుగారు

రావూరుపాడు, పశ్చిమగోదావరి.

శ్రీ సుజనరంజని ముద్రాక్షరశాల,

రాజమహేంద్రవరము.

1927




[ వెల 0—2—0




ఈ గ్రంథ [stamp] గ్రంథకర్త విళంబి సంవత్సరములో స్వహస్తము [stamp] వ్రాసిన ప్రతి లభించినది. ఆ వ్రాత ప్రతిననుసరించి ముఖ్యములైన తప్పొప్పులు క్రింద వివరింపబడినవి.

| పుట | పంక్తి | అచ్చుప్రతి | వ్రాతప్రతి |
|---|---|---|---|
| 4 | 4 | సలరి | జూచి |
| 6 | 4 | కరికుంభయుగంబుఁ గం బుఁగనరుణ గొనరున్ | గురుకుంభయుగంబుఁగ బుఁగొనరున్ గనరున్ |
| 7 | 6,7 | మణికుచ, కుంభ | మణీస, గుంభ |
| 9 | 14 | పారెడి | పొందెడు |
| 9 | 16 | గొలిచి | గాంచి |
| 10 | 12 | తోడ | తోడు |
| 12 | 20 | మొప్పగ | వృత్తిగ |
| 13 | 16 | నేని | నేఁడి |
| 14 | | సకలసంపత్ప్రదా సమ్మతంబు | సర్వసంపత్ప్రదానైక సాధనంబు |





# పీఠిక

## కవి జీవిత చరిత్ర

గ్రంథకర్త మాతండ్రిగారు. ఆపస్తంబసూత్రులు. హారితసగోత్రులు. ఆఱువేలనియోగిబ్రాహ్మణులు. కేసిరాజు పట్టాభిరామామాత్యపౌత్రులు. ఆచంటరాజలింగామాత్య దౌహిత్రులు. తండ్రి పుల్లమరాజుగారు. తల్లి కామాంబ. వీరి నివాసగ్రామ మగు మలకపల్లి రాజమహేంద్రవరమునకుఁ బది మైళ్లదూరమున నున్నది. అందు వీరు 1858 వ సంవత్సరమున జన్మించి తమ పదునాఱవయేఁట జనకవియోగమగువఱకును దండ్రియొద్దనే విద్యాపరిశ్రమ చేసిరి. కవికిఁ జిన్ననాటనుండియు లౌకికవ్యాపారవైముఖ్యమును, దైవభక్తియు, నాముష్మికచింతయు మిక్కుటము. సంగీతసాహిత్యములందును బద్యములు చెప్పుటయందును నభిలాష మెండు. తమయుపాధికై వీరు ప్రైమరీస్కూలులో నుపాధ్యాయులుగా నుండి యల్పసంతోషులై యైహికవిషయచింతలఁ జెంతఁ జేరనీక తమ జీవితము నిశ్శంకముగా గడిపిరి. వీరి నెఱింగినవారిలోఁ గొందఱు వీరిసాహిత్యజ్ఞానమును గొందఱు వీరిబ్రహ్మజ్ఞాన సంపదను, అందఱును బండితపామరానురంజక మగు వీరి పౌరాణికశక్తియు నిప్పటికిని గొనియాడుచుందురు, తఱుచు నుస్నేహితులగు రామభక్తులతోఁ గలిసి తాళమృదంగసహి

ముగా రామభజన సేయుచు నంపుఁ దామురచించినకీర్తనలు గాడుచుండెడివారు శ్రీరామచంద్రమూర్తియే వీరియిష్టదైవము. మొదటనుండియు వీరు సగుణసేవాతత్పరులై తుదకు స్వేచ్ఛానందు లను మహానుభావులప్రసాదమునఁ గృతార్థులై తమనలుబదిరెండవయేఁట ననఁగా 1899 వ సంవత్సరమునఁ గైవల్యము నొందిరి. వీరు రచించిన గ్రంథములు.

(1) సర్వేశ్వర వేంకటరమణశతకములు. ఈగ్రంథములు లభింపలేదు.

(2) వేంకటేశ్వరతారావళి.

(3) చోరచరిత్రము.

(4) రామదాసనాటకము.

(5) భద్రాద్రిరామాయణము.

(6) ఏకాదశీమహిమాసర్వస్వము.

ఈగ్రంథములనుగూర్చి చివరమూఁడుగ్రంథములపీఠికలలోను వ్రాయఁబడినది.

ఉ ప సం హా ర ము.

ఈగ్రంథమందలి రచనాపాటవమును శైలియు సరసులగు పాఠకులే గ్రహింపఁ దగినవి. కాని యక్కడక్కడఁ గొన్ని ప్రమాదము లుండవచ్చును. విద్వల్లోక మట్టివి సైరించి గుణగ్రహణము సేయుఁ గాక యని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

రాజమహేంద్రవరము
20—11—26

బుధజనవిధేయుఁడు
కేసిరాజు సత్యనారాయణ



శ్రీరస్తు.

శ్రీ గురవే నమః.

# చోరచరిత్రము.

శ్రీమహోన్నతవరంబు నందు సగుణ ♦ శ్రీ నింపుచున్ భూరమా
వామాక్షీమణు లర్థిఁ బార్శ్వగతలై ♦ వర్తింపఁగా లోకర
క్షామేయస్ఫుటకార్యధుర్యుఁడయి భ♦క్తాళిం గృపం బ్రోచునా
స్వామిన్ గేశవదేవుఁ గొల్చెదను భా♦వంబందు మోక్షార్థినై.

ఉ. వల్లభు పెన్నురంబునన ♦ వర్తిలు జాణ రతీందుఁ గన్న యు
త్ఫుల్లసరోజనేత్ర యల ♦ పున్నమచందురుతోడఁబుట్టు పా
ల్వెల్లికి ముద్దుకూఁతు రప ♦ లీల జగంబుల నెల్ల నెల్లెడం
జల్లనిచూపులన్ మనుచు♦చానయొసంగు మదీప్సితార్థముల్.

గీ. అగణితదయాసనాథుఁ డై♦న గణనాథు
భారతిని భక్తిరతి నెంచి ♦ ప్రస్తుతించి
సంస్కృతాంధ్ర కవిత్వ ప్ర♦శస్త విభవు
లై విడంబించు సుకవుల ♦ నభినుతింతు. 3

ఉ. మానితరీతిఁ బ్రతిస♦మంబును భక్తు లొనర్చు విష్ణు క
ల్యాణమహోత్సవాంతరిత♦మై తగు చోరకథాప్రసంగ మెం
తేనియు సంగ్రహించి రచి♦యింపఁగ నొప్పుఁ దదుత్సవాళిజా
గూనకయుండ శ్రోతలిర♦వొందఁగ నావిహితోక్తిచొప్పునన్.

ఉ. పంకజలోచనాంఘ్రియుగ ♦ భక్తవిధేయుఁడు కేసిరాజు శ్రీ
వేంకటసుబ్బరాయుఁ డన ♦ విశ్రుతి నొందిన యట్టి యే నిరా
తంకముగాఁగఁ బోతవర ♦ ధాముఁడు నిస్సముఁడైన శౌరి నా
మాంకిత మొప్పఁజెప్పఁదగు ♦ నచ్చరితంబునకాదియెట్లనన్.

కథాప్రారంభము.

గీ. కాంతి నింపొందు సహ్యజా ♦ ప్రాంత చోళ
ధారుణీ ఖండమందు భ ♦ వ్యారవింద
మందిరావాస మగుచుఁ జె ♦ న్నొందు నృహరి
పురవరము తీరు శ్రీ తిరు ♦ క్కొరయలూరు. 6

క. ఆ పురము గాఁపురముగా
నేపారు నొకండు మ్లేచ్ఛుఁ ♦ డీడిత సుగుణ
వ్యాపారుఁ డగుచు నెప్పుడు
శ్రీపతి చరణాబ్జ యుగళ ♦ సేవానిరతిన్. 7

క. ఆతని కుదయించెఁ దనూ
జాతుం డొకఁడా రమేశ ♦ శార్ఙ్గాంశమునన్
ధూతారి జనవ్రాతుం
డాతత భుజ బలసమేతుఁ ♦ డని జను లెన్నన్. 8

గీ. అట్టు లుదయించి నట్టి య ♦ య్యర్భకుండు
నీలుఁడను పేర వృద్ధి జెం ♦ ది మఱి బాల్య
భావ మెడలఁగ నారూఢ ♦ యౌవనుఁ డయి
జారచోరాది విద్యలఁ ♦ జాలఁ దేఱి. 9

క. దిటము గల భటుల సంగతిఁ
జటుల తరానేక యుద్ధ ♦ సాధన కుశలో
ద్భటుఁ డగుచు విక్రమోద్ధతి
నిటలాక్షుని సరి యనంగ ♦ నిర్నిద్రగతిన్. 10

గీ. అలరువాఁ డొందు ద్రవ్యార్థి ♦ యగుచుఁ జోళ
భూపతిని జూచు వేడ్కఁ ద ♦ త్పురవరమున
కురుజవం బొప్ప నేగి యం ♦ దొక్కనాఁడు
రాణ నింపొందు సౌధాంత ♦ రంబు నందు. 11

సీ. ఒకవంక విబుధేంద్ర ♦ నికరంబు లాగమో
దిత రహస్యోక్తులు ♦ దేటపఱుప
నొకవంక రాజకా ♦ ర్యకలావిశారదుల్
పలుమాఱు మంత్రాంగ ♦ పటిమ దెలుప
నొకవంక సునిశితా ♦ యుధపాణులై భటో
త్కరము లచ్చెంపు హె ♦ చ్చరికఁ బెనుప
నొకవంక వారహ ♦ ల్లకపాణు లంతంతఁ
గమనీయ లాస్య వి ♦ భ్రమము నెఱప
నల సువర్ణాసనా సీనుఁ ♦ డైన వజ్రి
పోల్కి నలరారి శ్రీచోళ ♦ భూతలేంద్రుఁ
డబ్జకాంతోపల స్థగి ♦ తాసనమున
పశాసు మీఱంగఁ గొలువున్న ♦ యవసరమున. 12

క. వినయంబు నయంబు ప్రియం
బును నెమ్మదిఁ బొదల నెలమిఁ ♦ బొందుచు నభివం
దనపూర్వకముగ దర్శన
మొనరించిన నలరి యధిపుఁ ♦ డుల్లాసమునన్. 13

సీ. నీల జీమూత స ♦ న్నిభ శరీరమువానిఁ
దరుణారుణాబ్జ నే ♦ త్రములవాని
వర సితోష్ణీష భా ♦ స్వర మస్తకమువాని
గడితమౌ కాసె చ ♦ ల్లడమువానిఁ
బరిఘాలసద్దీర్ఘ ♦ బాహాయుగ్మమువానిఁ
గఠినోరు విపుల వ ♦ క్షంబువానిఁ
గటిమీఁదజాళువా ♦ కైజారుగలవానిఁ
గరధృత ఖేట ఖ ♦ డ్గములవాని
నీలు ననవరతాహితా ♦ భీలుఁ గాంచి
ప్రేమఁ బరకాలుఁ డనియెడు ♦ బిరుదుపేరు
గ్రామములు గొన్ని జాగీరు ♦ గరిమ నొసఁగి
సైన్యపాలుని జేసె హె ♦ చ్చరికఁ బెనుప. 14

క. ధన బల సంపన్నుండై
తనపురమున కరుగుదెంచి ♦ తద్దయు వేడ్కన్
మనమలరఁ బ్రజాపాలన
మొనరింపుచు నుండె నంత ♦ నొక్కదినమునన్. 15

క. ధారుణిఁ గలుగు విశేషము
లారసి యతి శీఘ్రగతుల ♦ నరుదెంచి మహా
దారులగు చారు లభిమత
మారఁగ మ్రొక్కి లిడి పలికి ♦ రాతని తోడన్. 16

క. స్వామీ! తిరుణాంగూ రను
గ్రామమున భిషగ్వరాఖ్యుఁ ♦ గలఁ డొక విబుధుం
డామాన్యున కొక్క కుమా
రీమణి గలదసమరూప ♦ రేఖాన్వితయై. 17

క. విందు మమరీ కదంబము
గంచుమె కద మనుజ కన్య ♦ కాబృందము నేఁ
డొందైన నీసతీమణి
సౌందర్యము పొందువడమి ♦ సత్య మ్మనఘా! 18

క. ఆరామామణి వదనము
సా రా రాకేందు బింబ ♦ సదృశము; వేల్పుం
గా రా నడకకు సరి; మే
లౌరా యొయ్యార మెంత ♦ యౌరా చెలికిన్! 19

క. పదము లరుణాబ్జ రేఖా
స్పదములు; నేత్రములు గమల ♦ పత్రమ్ము లగున్;
రదములు మిక్కిలి శ్వేతంగా
రదములు కళికలకు; విరిస ♦ రంబులు కరముల్. 20

క. కురు లిందని నీల మణులొ౯
గురువిందము పస నెసంగు౯ ♦ గోమలియధరం
బురుకుచ యుగళము గళమును
కరికుంభయుగంబు౯ గంబు౯ ♦ గసరు౯ గొసరున్. 21

గీ. ఏమి౯ కతమునసో నిజ ♦ స్వామి౯ బాసి
లీల నరుదెంచి కుముదవ ♦ ల్లి యను పేర
జగతి విహరించు నిందిరా ♦ సతి యటంచు
మానసంబున౯ దో౯చెడి ♦ మూరు౯ జూడ. 22

క. ఆ మానవతి వరితం బొక౯
డేమో మదిని బూనె న౯ట త♦దీప్సిత మలరన్
దా మాన కట్లొనర్చిన
యామానవు౯ బెండ్లియాడు ♦ న౯ట రహి మీాఱన్. 23

క. ఇది యొకవిశేష మగుటను
వదలక దేవరకు౯ దెలుప ♦ వచ్చితి మనుడున్
ముద మొదవ౯గ విని యత౯డా
మదవతిపై౯ బ్రేమ దగిలి ♦ మనసు గలంగన్. 24

సీ. ధరలోన జంగమ ♦ స్థావరాత్మకమయి
జనియించు నీ భూత ♦ జాలమందు
నెందు మానుషజన్మ ♦ మెత్తుట దుర్లభం
బగు నందు నఖిల భో ♦ గాస్పదంబు

నగు పూరుషాకృతి ♦ నావిర్భవించుట
యతిదుర్ఘటం బగు ♦ నందులోన
ధైర్య గాంభీర్య చాతుర్యాది గుణవృత్తి
గాంచుట మిగుల దు ♦ ష్కరము గాన
నిట్టి జన్మంబు నొందుట ♦ కేమి ఫలము
ప్రేమమునఁ దాదృశాంబుజా ♦ క్షీమణి కుచ
కుంభ పరిరంభణారంభ ♦ కుతుక జలధి
నోలలాడక యూరక ♦ యున్న నిజము. 25

ఉ. ఏగతిఁ గన్యకామణి స ♦ మీహితమబ్బునొ ప్రౌఢఁ బోఁడి దా
నేగతి నన్ను మెచ్చి వరి ♦ యించునొ యేమనునో భిషగ్వరుం
డేగతి దైవసంఘటన ♦ మేర్పడునో తుద కేమొ యంచు నా
నాగతులం దలంపుచు మ ♦ నంబురియాడఁగ నంతలోపలన్.

క. కానిమ్మడిగియ చూచెద
మానిని నా కిచ్చె నేని ♦ మర్యాదయ కా
తా నొకటి వేఱె తలఁచినఁ
బోనిత్తునె చలము బలము ♦ పూనక వానిన్. 27

మ. అని యోజింపుచు నాతఁ డంతె నిజసై ♦ న్యవ్రాతముల్ [గొల్వఁగన్,
న్నన భద్రాశ్వము నెక్కి చక్కనగు తీ ♦ ర్ణాం గూరికిన్ [బోవఁగన్,
కున నాతం డెదు రేగుదెంచి బసకుం ♦ గొంపోయి [పూజించి భో,

జనసత్కారము సల్పి యిట్లనుఁ బ్రీతిం • సారూప
[వాక్యంబులన్. 28

గీ. ఓమహాత్మ! భవాదృశో • ద్యోగపరులు
మాదృశుల యిండ్ల కిట్లు స • న్మానగరిమఁ
గారణము లేక విచ్చేయు • వారు గారు
గానఁ బని యేమొ దయచేసి యానతిండు. 29

చ. అనవుడు నవ్వుచుం బలుకు • నాతనితో హరిభక్తవర్య! మీ
తనయను నా కొసంగి ప్రమ • దంబునఁ బెండ్లియొనర్పఁ
[గాఁదగున్,
ధనమణిహాటకాంబరవి • తానము సొమ్ములు మీరలిచ్చగిం,
చిన క్రియఁ గూర్చువాఁడ నర • సేయక నిక్కము సుమ్ము
నావుడున్. 30

గీ. మనవి చేసెద నని లోని • మందిరమున
కరిగి సతితోడ సుతతోడ • నతనికోర్కె
యంతయును దెల్పి వారల • యభిమతంబు
వడసి మఱివచ్చి వానితోఁ • బలికె నిట్లు. 31

క. మీయంతవారు గోరిన
నీయమి యనుమాట పుట్టు • నే యభిమతముల్
సేయం బూనినయప్పుడు
నాయాత్మజపూన్కి వినుఁడు • నయ మొప్పంగన్. 32

గీ. పంచసంస్కారములు గల్గి ♦ ప్రతిదినంబు
భక్తినష్టోత్తర సహస్రి ♦ వైష్ణవాళి
కన్న మిడి పాదతీర్థంబు ♦ గొన్న పరమ
పుణ్యనదు భార్య యగుటకై ♦ పూని వ్రతము. 33

క. ఈరీతి మెలఁగ నేర్చిన
నారీతిలకంబు మీఁద ♦ నం బగు సత్యం
బారీతి వర మొసంగి జి
తారీ! నను ధన్యఁ జేయు ♦ నఘుఁ గృప ననఁగన్. 34

క. వల్లె యని పరకాలుం
డుల్లంబునఁ బొంగి బుధ జ♦నోత్తము పలుకుల్
సెల్లింపఁ బూని వారికిఁ
దెల్లముగా నపుడె బయలు ♦ జేటి జవమునన్. 35

క. తిరువరయూ రనియెడి యొక
పురవరమున కేగి యందుఁ ♦ బొలు పారెడి శ్రీ
కరుఁ డగు వైష్ణవకులశే
ఖరునిన్ నంబివరుఁ గొలిచి ♦ కను నుత్సుకతన్.

సీ. పంచసంస్కారార్థ ♦ పంచక జ్ఞానముల్
వడసి తిరుమంగయూ ♦ ళ్వారనంగఁ
బొదలుచు హరిభక్తి ♦ పూర్ణుఁడై ముదముతో
మరలఁ దీర్ఘాంగూరి ♦ కరుగుదెంచి
వినతిమద్గ్వరునిచే ♦ వివిధసత్కారంబు
లంది తత్సుతఁ బెండ్లి ♦ యాడి యపుడు

సకలవైభవ సము ♦ జ్జ్వలుఁడై నిజాంగనా
మణితోడఁ దనదు ప♦ట్టణముఁ జేరి
బాస దప్పక యొప్పుగాఁ ♦ బ్రతిదినంబు
భక్తి నష్టోత్తర సహస్ర ♦ వైష్ణవులకు
మృష్టాన్నంబు లొసఁగి త♦చ్చరణతీర్థ
ముల గ్రహింపుచు సుఖవృత్తి ♦ వెలయుచుండె. 37

చ. కతిపయవాసరంబులకు♦గాఁ గలవిత్తము కొల్లవోవ స
మ్మతి నిజభామినీగళ స♦మంచిత కాంచనసూత్ర మాదిగా
నతులవిభూషణావళుల ♦ నమ్మి నిరంతర వైష్ణవార్చన
వ్రతమరలేక సేయుచుఁ గ♦రంబుభరంబగుచుండఁ దెంపునన్.

ఉ. దారుణవృత్తి కోర్చి బల♦దర్పితులై తమిఁ బేర్చినట్టి స
ర్దారులు తోడరా నడవి♦దారులు గొట్టియు రాత్రివేళలం
దారిగృహాళిఁ గన్నములు♦ద్రవ్వియు నిత్యముదొంగిలించిదు
ర్వారమదోద్ధతిన్ ధనమ♦పారముగాఁ గొనివచ్చువెండియున్.

క. జూదంబులఁ గపటవచో
వాదంబుల నేర్పు మెఱసి ♦ బహుధనములు సం
పాదింపుచుఁ దద్వ్రత మా
హ్లాదంబున జరుపు నీశ్వ ♦ రార్పణ మనుచున్. 40

క. నిర్గతభయుఁడై చోరుఁడ
నర్గళగతి నిందు వెలయు ♦ ననుచు సతంబున్
దుర్గమము లైన యవ్వన
మార్గంబుల నడువ రైరి ♦ మనుజులు భీతిన్. 41

గీ. అంత నొకనాఁడు శ్రీవైష్ణ ♦ వార్చనంబు
సలుప ద్రవ్యంబు లేమిఁ జిం♦తిలుచుఁ జక్క-
నొక్క యుర్వీరుహాగ్రంబు ♦ నెక్కి దెసలు
గనుఁగొనుచునుండెఁ బథికవ ♦ ర్గముగుఱించి. 42

క. ఆరీతిఁ గనెడుచోరుని
చారిత్ర మెఱింగి భక్త ♦ జనరత్నుఁడా దీ
తారంభకుశలుఁ డగు ల
క్ష్మీరమణుం డిటు తలంచెఁ ♦ జిత్తములోనన్. 43

గీ. ఔర ! వీనిచరిత్ర మ ♦ త్యద్భుతంబు
దారుణం బగు చౌర్యవృ ♦ త్తమున కోర్చి
వైష్ణవారాధనముల స ♦ ద్భక్తి సలుపు
నరయ నీగతి ధైర్య మెం ♦ దైనఁ గలదె. 44

ఉ. కంకటయుక్తమైనను సు♦గంధరసస్థితిఁ జేసి యొందు ని
ష్కంటకవృత్తిఁ జందనము♦ గ్రాలువిధంబున వీఁడుదుర్నయుం
డంటిమ యేని వైష్ణవ ప♦దాంఘ్రిపయోరుహ తీర్థసేవ ని
ష్కంటకవృత్తిఁ జెన్నలరుఁ♦గావున బ్రోవఁగఁ బాడి యీతనిన్

సీ. అని నిశ్చయించి ద ♦ యాపయోనిధి యైన
కమలాకళత్రుఁ డు ♦ త్కంఠ వెలయఁ
జతురాననుఁడు పురో♦హితవృత్తిఁ జెన్నార
వేలుపుగమి బంధు ♦ వితతి గాఁగ

వెస మహేశుఁడు పెండ్లి ♦ పెద్దయై చనుదేర
నుడురాజు తోఁబెండ్లి ♦ కొడుకు గాఁగఁ
గ్రితుభుగంగన లాట ♦ కత్తెలై రహి మీరఁ
గౌరి శ్రీసతి పెండ్లి ♦ కూఁతు గాఁగ
శౌరి దా నొక్క పెండ్లికు ♦ మారుఁ డగుచు
హైమపల్యంకికారూఢుఁ ♦ డై యపూర్వ
విభవములతోడ నప్పు డ ♦ వ్వీరవరుని
కట్టెదుటఁ దత్క్షణంబు సా ♦ క్షాత్కరించె. 46

గీ. అట్లు సాక్షాత్కరించిన ♦ యబ్జనాభు
లీల తెలియఁగమి నప్పర ♦ కాలసూరి
యెవ్వ డో భూసురకుమారుఁ ♦ డిట్లు పరిణ
యం బెఱు నిజాలయంబున ♦ కరుగువాఁడు. 47

పంచచామరము.

అహా రె నాయదృష్ట మంబు ♦ జాయతాక్షు సారవ
ద్దయారసంబు పేర్మిఁ జాల ♦ ద్రవ్యముల్ లభించెఁ గా
రయాన వీని సంగ్రహించి ♦ ప్రౌఢి వైష్ణవార్చన
క్రియాపరుండ నయ్యెదన్ వ ♦ రీయ మైన భక్తితోన్. 48

క. అని తలఁచి యమ్మహీరుహ
మనుపమవేగమున డిగ్గి ♦ సాయుధు లగుచున్
దనభటులు గూడి వడువఁగఁ
జని వారల నడ్డగించి ♦ సాహస మొప్పన్ 49

చ. గరగరికన్ వధూవరుల ♦ కాంచన రత్నవిభూషణంబు లం
బరములు చందనప్రముఖ ♦ వస్తుకదంబములున్ హరించి స
త్వరగతిఁ బెట్టెలం దునిచి ♦ భార మదేము కదల్పరామి న
చ్చెరువడి విష్ణుమంత్రి జప ♦ శీలుఁ బురోహితుఁ గాంచి
[యుల్కుతోఁ. 50

ఆ.వె. వీఁడు మంత్రవాది ♦ వెఱ పేది యీ పేటి
కానికాయ మిట్లు ♦ కదల కుండఁ
జేసె వీనిఁ బట్టి ♦ శిక్షింపఁ జక్కనౌఁ
బను లటంచు బాధ ♦ పఱచుటయును. 51

క. అతఁ డిది నాపనిగా దీ
మతకరి యగు పెండ్లికొడుకు ♦ మాయలు వన్నన్
జతురుఁ డకట! న న్నేటికి
వెతలం బెట్టెదరు నిజము ♦ విడువుం డనఁగన్ 52

శా. ఆమాటల్ విని నవ్వి పెండ్లికొమరుం ♦ డాచోరునిం బల్కునో
హోహా మాన్యుల్ గడువృద్ధు లిట్టి ద్విజ వ ♦ ర్యుల్ మాయ
[గల్పింతురే
యీ మాయామహిమంబు నాయుడిదియ సు ♦ మ్మీ యెక్కుడా
[ప్రేమ నీ
కీ మంత్రం బుపదేశ మీఁ దలఁచి నే ♦ నీ రీతిఁ గావించినన్

గీ. మఱియు సీమంత్రిరాజంబు ♦ మహిమ వినుము
వివిధ పరమంత్రి తంత్రి వి ♦ భేదనంబు
సకల సంపత్ప్రిధానైక ♦ సమ్మతంబు
గాన దీనిని గొనుము ని ♦ క్క మిది సుమ్ము 54

చ. అనవుడు నేమొ చూతము భ ♦ యంపడ నేల నిజంబె [యైన మే
లనయ మసత్య మేని యిటఁ ♦ డా మన కడ్డము శాస్త్రి [సేయఁగ
యని తలపోయుచున్ జలరు ♦ హాక్షుని దగ్గఱి స్వామి [మంత్రము
గొనెద ననుగ్రహింపు మనఁ ♦ గూరిమితో నతఁ డాద [రింపుచున్

గీ. భవ భయ హారంబు గలుషాబ్ధి ♦ బాడబంబు
చతుర ధర్మార్థ కామ మో ♦ క్ష ప్రదంబు
భక్త జన సేవ్య మత్యంత ♦ పావనంబు
నైన యాత్మీయ తిరుమంత్ర ♦ మాన తిచ్చె 18

సీ. ఆరీతి నుపదేశ ♦ మాచరించిన మాత్ర
నచ్చోరముఖ్యున ♦ కద్భుతముగ
నధిగతం బయ్యె శు ♦ త్యంతసారం బెల్ల
నలవడె నఖిల వి ♦ ద్యా విశేష

మంకురితం బయ్యె ♦ నలఘు తర జ్ఞాన
మలరారె భక్తియో ♦ గానుభూతి
కరగతం బయ్యె స ♦ త్కవితా విలాసంబు
ప్రబలె సంపూర్ణ వై ♦ రాగ్య గరిమ
యేమనఁగ వచ్చు హరి కృపా ♦ దృష్టి పేర్మి
నంతఁ బరకాలుఁ డతి విస్మ ♦ యాత్ముఁ డగుచు
నెడఁద నిదమిత్థ మని నిశ్చ ♦ యింప లేమి
నట్టె కేల్మోడ్చి యుండె న ♦ య్యవసరమున 57

ఘనకౌస్తుభాంక సం ♦ కలిత వక్షంబుతోఁ
దంబైన మణికిరీ ♦ టంబు తోడ
మహిత నాసాగ్రస ♦ న్నిహిత మౌక్తికముతోఁ
గరధృత శంఖ చ ♦ క్రములతోడ
వర్ణింపఁ దీర్ణ సౌ ♦ వర్ణ చేలంబుతోఁ
రవణించు తారహా ♦ రములతోడ
నీల జీమూత స ♦ న్నిభ దేహకాంతితోఁ
డామర సాభ నే ♦ త్రములతోడ
నలరి యురువంక శ్రీ భూస ♦ తులు రహింప
హరి నిజాకృతి నొంది స ♦ ర్వామరేంద్ర
గణము గీర్తింప విహగ పుం ♦ గవతురంగుఁ
డగుచు వేంచేసె వైకుంఠ ♦ నగరమునకు 58

గీ. మఱి
అంతఁ బరకాలసూరి యు
నంత కృపా మహిత శౌర్య ♦ తైశ్వర్యండై
చింత లుడిగి మది లక్ష్మీ
కాంతుని భజియింపుచును సు♦ ఖస్థితి నొప్పెన్ 59

సీ. ద్రావిడ శ్రుతుల క ♦ ర్థప్రదర్శకముగా
మత్ప్రబంధములు గ్ర ♦ చ్ఛముఁ రచించెఁ
బాషండ మత సంప్ర ♦ వర్తనుం డైన సం
బంధి కవీంద్రు గ ♦ ర్వం బడంచె
స్థిరవృత్తిమై దివ్య ♦ దేశంబు లన్నియుఁ
దమి మంగళాశాస ♦ నము లొనర్చె
రంగేశునకు దృఢ ♦ ప్రాకార మంటప
ప్రభృతికైంకర్య మ ♦ ర్పణము జేసెఁ
గలిహయుం డన లోకోప ♦ కారనియతి
నాచరించెను ధర్మ కా ♦ ర్యములు పెక్కు
లట్టి తిరుమంగ యాళ్వారు ♦ నరిదిచరిత
మఖిలకలికల్మషాపహం ♦ బై వెలయుత 60

ఆ. వె. శ్రీమదుభయగాత ♦ మీమధ్య భాగప్ర
భాసమానపోత ♦ వరనివేశ !
దితిసుతప్రణాశ !♦ దితభక్తభవపాశ !
సింధుజాహృదీశ! ♦ చిత్ప్రకాశ ! 61

చోరచరిత్రము

క. నాకాధిప ముఖ విబుధా
నీకార్చిత పదపయోజ ! నిరుపమతేజా !
లోకావన ఘన లీలాం
గీకృత గుణభావ! చెన్న కేశవదేవా!.

గద్య- ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షాపాత్ర హారిత
గోత్ర పవిత్ర కేసిరాజు పుల్లమరాజ సుపుత్ర బుధజన
విధేయ వేంకట సుబ్బరాయ ప్రణీతం బైన
చోర చరిత్రంబు నందు సర్వంబును

ఏకాశ్వాసము.

